ఇవ్వాళ రేపు పట్టణంలో పిల్లలు పాలు ఫ్యాక్టరీలో నుంచి వస్తాయనుకుంటారు, గుడ్లు దుకాణాలలో దొరుకుతాయి అనుకుంటారు. అటువంటిది ఒక పిల్లవాడు కోడి గుడ్లను తల్లి కోడి లేకుండా పొదిగి పిల్లలను తయారు చేశాడు. దీంట్లో ఆమె స్నేహితురాలు కూడా సహాయపడింది. దీని కోసం వాళ్లు పుస్తకాలు చదివారు. కొన్ని ప్రయోగాలు చేశారు. చాలా వరకు అనుభవం మీద తెలుసుకున్నారు. అంతేకాదు నిద్రలేని రాత్రులు గడిపారు. చదువుల్లో వెనుకపడ్డారు. బడిలో తిట్లు తిన్నారు. చివరికి బడిపిల్లలందరూ దీంట్లో జతకలిశారు. చిన్న చిన్న కోడిపిల్లలు గుడ్లను పొడుచుకుని బయటకు వచ్చినపుడు ఆ పిల్లల ఆనందం మాటల్లో చెప్పలేం.



**విజ్ఞాన శాస్త్రంలో అయిదు చిన్న పుస్తకాలు**

| | | |
|---|---|---|
| 1. | పుడమి పుట్టుక | వెల : రూ. 7/- |
| 2. | పుడమి రహస్యాలు | వెల : రూ. 9/- |
| 3. | విజ్ఞాన శాస్త్రంతో వినోదాలు | వెల : రూ. 10/- |
| 4. | బన్ను జంతువులు | వెల : రూ. 8/- |
| 5. | కోడి పిల్లలు | వెల : రూ. 8/- |








విజ్ఞాన శాస్త్రం - 5

# కోడి పిల్లలు

నికొలయ్ నోసోవ్













జన విజ్ఞాన వేదిక

మంచి పుస్తకం

కోడి పిల్లలు

రచన : నికోలయ్ నోసోవ్

హిందీ అనువాదం : అరవింద గుప్త

తెలుగు అనువాదం : కె. సురేష్

బొమ్మలు : శర్మిష్ఠ శన్యాల్,
జ్యార్జీ యూడిన్ బొమ్మల ఆధారంగా

గ్రాఫిక్స్ : అభయ్‌కుమార్ ఝా

కాపీరైట్ : భారత్ జ్ఞాన విజ్ఞాన సమితి

ప్రచురణ కాలం : సెప్టెంబర్ 2004

వెల : 8-00 రూపాయలు

ప్రతుల సంఖ్య : 3,000

JOLLY FAMILY

by **Nikolai Nosov**

Hindi Translation by : **Arvind Gupta**

Telugu Translation by : **K. Suresh**

Pictures by : **Sarmishta Sanyal**
Based on original pictures by Georgie Udin

Graphics by : **Abhay Kumar Jha**

Copyright : **BGVS, New Delhi**

Published : **September 2004**

Price : **Rs. 8.00**

Copies : **3,000**

ప్రచురణ :



మంచి పుస్తకం
C/o. వాసన్, 12-13-452, వీధి నెం. 1,
తార్నాకా, సికింద్రాబాద్ - 500 017.



జన విజ్ఞాన వేదిక
ఫ్లాట్ నెం. 162, విజయలక్ష్మి నగర్,
నెల్లూరు-524 004. ఫోన్ : 0861-2305303

*These books in Hindi were developed by Bharata Gyan Vigyan Samithi, New Delhi as part of the National Literacy Mission and encouraging reading amongst children and neoliterates in rural areas.*

*Published as part of the Books For All programme with a partial support from Centre for Innovation in Voluntary Action.*

Printed at :
**Charita Impressions,** 1-9-1126/B, Azamabad, Hyderabad. Ph: 2767 8411

# కోడిపిల్లలు



నికోలయ్ నోసోవ్

# కోడిపిల్లలు

ఒక రోజు నేను మిష్కా వాళ్ళింటికి వెళ్ళాను. అతడు పుస్తకం చదవటంలో లీనమై ఉన్నాడు. నా అడుగుల చప్పుడు కూడా అతడికి వినపడలేదు. నేను చప్పుడయ్యేలా తలుపు వేసినప్పుడు తలెత్తి నన్ను చూశాడు.

'నువ్వా నికోలా!' అతడు నవ్వుతూ అన్నాడు. మిష్కా ఎప్పుడూ నా అసలు పేరుతో పిలవడు. నాకు వింత వింత పేరులేవో పెడుతూ ఉంటాడు.

నికోలా, మికోలా, మికులా, సోల్తాన్‌విక్, మిక్లూఖో, మాకలాయి అని పేర్లు పెడుతూంటాడు. అతడంటే నాకిష్టం కాబట్టి ఇవేవీ నేను పట్టించుకోను.

'కోళ్ళ పెంపకం' అన్న పుస్తకాన్ని మిష్కా చదువుతున్నాడు. ముఖ చిత్రం మీద కోడిపుంజు, కోడిపెట్ట, ముద్దొచ్చే కోడిపిల్లల బొమ్మలున్నాయి.

'విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన పుస్తకం చదువుతున్నట్లు ఉన్నావ్' నేనన్నాను.

'విజ్ఞానశాస్త్ర విషయాలు ఎంతో ఆసక్తికరంగా ఉంటాయి. ఇవి దేవదూతలు, దయ్యాలు ఉండే ఉత్తుత్తి కథలాంటివి కావు. దీంట్లోని ప్రతి విషయమూ వాస్తవమే కాకుండా ఉపయోగకరమైనది కూడా' మిష్కా అన్నాడు.

ఏ పనిచేసినా అది ఉపయోగకరంగా ఉండాలన్నది మిష్కా అభిప్రాయం. ఒకసారి మిష్కా విశ్వవిద్యాలయంలో బోధించే అడ్వాన్స్‌డ్ ట్రిగ్నామెట్రీ పుస్తకం కొనుక్కొచ్చాడు. కానీ దాంట్లో ఒక్క విషయమూ అతడికి



అర్థం కాలేదు. అప్పటి నుంచి ఆ పుస్తకం అతడి బల్లమీద ఓ మూల ఉంటుంది. అతడు తెలివిమంతుడయ్యే రోజుకోసం అది ఎదురు చూస్తోంది.

అతడు చదువుతున్న పుస్తకంలో ఒక గుర్తు పెట్టి దాన్ని మూసివేశాడు. 'కావాలనుకుంటే మనం ఇంట్లోనే ఒక వేడిపెట్టి (ఇనుక్యుబేటర్) తయారుచేసి కోడిపిల్లలను తయారుచేయవచ్చు. గుడ్లను పొదిగే సమయంలో కోడి గుడ్లను పెట్టదన్న సంగతి నీకు తెలుసా? కోడి బదులు కృత్రిమంగా గుడ్లను పొదగ గలిగితే కోడి నిరంతరం గుడ్లు పెట్టగలుగుతుంది. దీనితో మనదేశంలో గుడ్ల ఉత్పత్తి పెరుగుతుంది.'



'ఇది చేయటం అంత తేలిక కాదేమో' నేను అనుమానం ప్రకటించాను.

'చూడు, దీనివల్ల ఎంత ఉపయోగం ఉందో. మన దేశ ప్రగతిలో మనం పాలు పంచుకుందాం,' మిష్కా అన్నాడు, 'ఈ పుస్తకంలో ఇంక్యుబేటర్ తయారుచేసే విధానం పూర్తిగా ఉంది. 21 రోజులపాటు గుడ్లను దీంట్లో పొదిగితే పిల్లలు తయారవుతాయి.'

దేశానికి ఉపయోగపడే ఈ పనిలో మిష్కాకి సహాయపడాలని నాకు ఉంది. చిన్న కోడిపిల్లలంటే నాకు ఎంతో ముద్దు కూడా. మిష్కాలాగే నాకూ జంతువులన్నా, పక్షులన్నా ఇష్టం. నేను, మిష్కా బడిలో నేచర్ క్లబ్‌లో చేరాం. కాని ఆ తరువాత ఆవిరి యంత్రం (స్టీం ఇంజిన్) తయారుచేయటంలో తలమునకలయ్యాం. మా పేర్లను నేచర్ క్లబ్‌లోంచి తొలగించి వేస్తానని విత్యా బెదిరించాడు. మాకు ఇంకొక అవకాశం ఇవ్వమని విత్యాని అడిగాం.

'వంటింట్లో ఒక మూల మనం ఇంక్యుబేటర్ తయారుచేద్దాం. చిన్న చిన్న కోడిపిల్లలు తయారయిన తరువాత వాటికి అక్కడే ఆహారం పెట్టవచ్చు' మిష్కా అన్నాడు.

'మనం చేయటానికి మరో పనిలేదు. కాబట్టి దీనిని చేద్దాం' నేనన్నాను.

## కష్టాలు, సమస్యలు

'మనం ఇంక్యుబేటర్ తయారు చెయ్యవలసిన అవసరం ఉండదేమో. కోడిగుడ్లను మూకుడులో పెట్టి పొయ్యిమీద సన్నని మంట మీద వేడిచేస్తే సరిపోతుందేమో' నేను సలహా ఇచ్చాను.



'భలే సలహా ఇచ్చావు' మిష్కా అన్నాడు. 'కొంతసేపటికే మంట ఆరిపోయి గుడ్లు పాడయిపోతాయి. ఇంక్యుబేటర్‌లో గుడ్లను ఒక స్థిరమైన ఉష్ణోగ్రత వద్ద వేడిచెయ్యాలి. 102 డిగ్రీల ఫారన్‌హీట్ వద్ద గుడ్లను పొదగాలి.'












'102 డిగ్రీలే ఎందుకు?' నేను కుతూహలంగా అడిగాను.

'కోడి గుడ్లను పొదిగేటప్పుడు కూడా ఇంతే ఉష్ణోగ్రత ఉంటుంది' మిష్కా నిపుణుడి మాదిరి చెప్పాడు. ఆ తరువాత అతడు పుస్తకంలో బొమ్మలు చూపిస్తూ వివరించసాగాడు. 'చూడటానికి ఇంక్యుబేటర్ ఇలా ఉంటుంది. దీంట్లో నీళ్ళ ట్యాంకు ఉంటుంది. ట్యాంకు నుంచి ఒక గొట్టం గుడ్లు ఉండే పెట్టెలోకి వెళుతుంది. నీళ్ళ ట్యాంకును కిందనుంచి వేడి చేస్తారు. ట్యాంకు లోంచి వేడినీళ్ళు గుడ్ల పెట్టెలోకి వెళ్ళి దానిని వేడిచేస్తుంది. ఇక్కడ వేడిమిని చూపే థర్మామీటరు ఉంది. దీనితో మనం వేడిమిని గమనిస్తూ ఉండాలి.

'అయితే మనం నీళ్ళ ట్యాంకును ఎక్కడి నుంచి తేవాలి?'

'మనకు ట్యాంకుతో పనిలేదు, డబ్బాతో సరిపెట్టుకుందాం.'

'దానిని ఎలా వేడి చెయ్యాలి?'

'కిరసనాయిలు బుడ్డి లేదా కొవ్వొత్తులు ఉపయోగించవచ్చు. అటకమీద ఒక దీపం ఉన్నట్టు గుర్తు.'

వెంటనే అటక ఎక్కి దీపం కోసం వెతకటం మొదలుపెట్టాను. అటకమీద పనికిరాని సామాను, చాలా చెత్త ఉంది. రకరకాల సీసాలు, డబ్బాలు, మూతలు చిందరవందరగా పడి ఉన్నాయి. ఒక గూట్లో నాకు దీపం బుడ్డి కనబడింది. మిష్కా దానిని వెంటనే కిందికి దించాడు. మాకు ఒక రాగి గొట్టం, డబ్బా కూడా దొరికాయి. వీటన్నిటినీ మేం వంటింట్లోకి తీసుకెళ్ళాం. దీపం బుడ్డి శుభ్రం చేసి దాంట్లో కిరసనాయిలు నింపాం. తరువాత దానిని వెలిగించాం. అది బాగా పనిచేస్తోంది. మంట పెద్దది, చిన్నది చేసేది కూడా పని చేస్తోంది. తరువాత ప్లైఉడ్‌తో ఒక డబ్బా తయారుచేశాం. పదిహేను గుడ్లు దాకా పెట్టగలిగేటంత పెద్దగా డబ్బా ఉంది. గుడ్లను భద్రంగానూ, వేడిగానూ ఉంచటానికి దాంట్లో దూదిపరిచాం.



తరువాత దానికి ఒక మూత తయారుచేశాం. థర్మామీటరు పెట్టటానికి మూతలో ఒక రంధ్రం చేశాం. దీంతో ఎంత వేడిమి ఉందో చూస్తూ ఉండాలి. తరువాత రేకు డబ్బాకు రెండు రంధ్రాలు చేశాం – ఒకటి పైన, ఒకటి



కింద. రాగి గొట్టాన్ని పై వైపు రంధ్రానికి అతికించాం. తరువాత గొట్టాన్ని ఇంక్యుబేటర్ డబ్బాలో రెండు మూడు చుట్లు తిప్పి చివరికి దానిని రేకు డబ్బా కింద రంధ్రానికి అతికించాం. ఈ చుట్లు తిరిగిన గొట్టం వేడిమిని వ్యాపింపచేసే రేడియేటర్ అన్నమాట.

తరువాత మిష్కా ట్యాంకు కింద దీపపు బుడ్డి పెట్టాడు. అప్పటికి అన్నీ ఏర్పాట్లు పూర్తి అయ్యాయి. ట్యాంకును నీళ్ళతో నింపి దీపపు బుడ్డి వెలిగించాడు. కొంచెంసేపటికి ట్యాంకు, గొట్టంలో నీళ్ళు వేడెక్కి థర్మామీటర్ 102 డిగ్రీల ఫారన్‌హీట్ చూపించసాగింది. ఇంకా వేడి ఎక్కేదేమోగాని ఆ సమయంలో మిష్కా వాళ్ళ అమ్మ వచ్చింది.

'మీరిద్దరు ఇక్కడ ఏం అల్లరి చేస్తున్నారు? ఇల్లంతా కిరసనాయిలు కంపు కొడుతోంది' ఆమె కోప్పడుతూ అంది.

ఇంక్యుబేటర్ చేయాలన్న మా ఆలోచన చెప్పటంతో ఆమెకు చాలా కోపం వచ్చింది. మిష్కా ఆమెను ఎంతగానో బతిమాలాడు. కాని ఏంలాభం లేకపోయింది. మా ప్రణాళిక ఆ విధంగా మూలపడింది.

## వస్తువులకోసం వెతుకులాట

ఆ రోజు రాత్రి చాలాసేపటి వరకు నిద్రపోలేకపోయాను. ఇంక్యుబేటర్ గురించే ఆలోచనలు అన్ని. మా అమ్మకు ముందుగానే మంట అంటే భయం. అగ్గిపెట్టె నా కంట కనబడకుండా ఎప్పుడూ దాచి ఉంచేది. మిష్కా వాళ్ళ అమ్మ దీపపు బుడ్డి లాగేసుకుంది. ఆమె ఎట్టి పరిస్థితిలోనూ దానిని తిరిగి ఇవ్వదు. ఆలోచించగా, ఆలోచించగా నాకు ఒక ఉపాయం తట్టింది. దీపపు బుడ్డికి బదులుగా కరెంటు దీపం ఎందుకు ఉపయోగించ కూడదు.



నేను వెంటనే లేచి టేబిల్ లైట్ వేశాను. దానికి దగ్గరగా చెయ్యి పెట్టి చూశాను. కొంచెంసేపటికే నా చేయి బాగా వేడెక్కిపోయింది. గోడమీదనుంచి థర్మామీటరు తీసి బల్బు దగ్గర పెట్టాను. కొంచెం సేపటికే పాదరసం పైకి పాకసాగింది. బల్బునుంచి వేడిమి వస్తుందనటంలో ఇప్పుడు ఎటువంటి సందేహం లేదు. కాని ఆ రాత్రి నేను చేసిన ప్రయోగం ద్వారా ఆ తర్వాత నుంచి నా థర్మామీటరు సరిగా పనిచేయటంలేదు. అప్పటినుంచి అది 104 డిగ్రీలనే చూపిస్తోంది. ఐస్ గడ్డల డబ్బాలో పెట్టినా అది 104 డిగ్రీలనే చూపిస్తోంది. బల్బుకి మరీ దగ్గరగా పెట్టడంవల్లనో ఏమో అది పనిచేయటం మానేసింది.

బడిలో నేను మిష్కాకి బల్బు గురించి చెప్పాను. ఈ ఆలోచన అతనికి బాగా నచ్చింది. మేం ఇద్దరం ఇంటికి తిరిగి వచ్చి మా ప్రయోగంలో మునిగిపోయాం. ట్యాంకు కిందకు వచ్చేటట్లు మిష్కా బల్బుకింద కొన్ని పుస్తకాలు పెట్టాడు. అర్థగంటలోనే వేడిమి 102 డిగ్రీలకు చేరుకుంది. 'కిరసనాయిలుతోటైతే ఏమి, కరెంటుతో ఐతేనేమి మనకు కావలసిన వేడిమి ఇదే' సంతోషంతో అరిచాడు మిష్కా.

'నా ఉద్దేశంలో కిరసనాయిలుకంటే కరెంటు ఎన్నో రెట్లు మేలు', నేను అన్నాను, 'కిరసనాయిలుతో మంట అంటుకునే ప్రమాదం ఉంది. కరెంటుతో ఆ సమస్య లేదు.' అప్పటికి వేడిమి 104 డిగ్రీలకు చేరుకోవటం గమనించాం.

కిరసనాయిలు బుడ్డిలో అయితే వత్తి పెంచి, తగ్గించటం ద్వారా వేడిమిని నియంత్రించే అవకాశం ఉండింది. కాని కరెంటు బల్బుతో దీనిని ఎలా చెయ్యాలి? మరి కొంచెం సేపటికి నీటి ఉష్ణోగ్రత 108 డిగ్రీలకు చేరుకుంది.

'బల్బుని కొంచెం కిందకి దించు' నేను ఆలోచిస్తూ అన్నాను. బల్బు కిందనుంచి ఒక లావుపాటి పుస్తకాన్ని తీసేశాం. కొంచెంసేపటికి థర్మామీటరులోని పాదరసం కిందకిజారి వేడిమి 102 డిగ్రీలకు తగ్గింది.

'ఇప్పుడు అన్నీ సరిగానే సమకూరినట్లున్నాయి.ఇక గుడ్లు కొని తీసుకురావచ్చు.' మిష్కా అన్నాడు. 'నువ్వు మీ ఇంటి నుంచి కొంత డబ్బు తీసుకురా. ఈలోగా నేను మా అమ్మనుకూడా అడుగుతాను.'

ఎంతో బతిమాలితేగానీ మా అమ్మ నాకు డబ్బులు ఇవ్వలేదు. కానీ బజారులో కొనే గుడ్లనుంచి కోడిపిల్లలు తయారు కావని అమ్మ చెప్పింది. పిల్లలు చేయాలంటే ఊరినుంచి తాజాగుడ్లు సేకరించాలి. నేను పరిగెత్తుకుంటూ వెళ్ళి మిష్కాకి ఈ విషయమంతా చెప్పాను.

## మరుసటిరోజు

జీవితం ఎంత చిత్రమయినది! నిన్నటివరకూ మేము ఎక్కడికీ వెళ్ళాలనుకోలేదు. కానీ ఈ రోజు రైలులో కూర్చుని నతాశా అత్తవాళ్ళ ఊరుకు వెళుతున్నాం. మమ్మల్ని చూసి అత్త ఎంతగానో సంతోషించింది. ఆమె దగ్గర కొన్ని రోజులపాటు ఉంటామని ఆమె అనుకుంది. కొన్ని గుడ్లకోసం వచ్చామని విని ఆమె ఆశ్చర్యపోయింది.

'మీ పట్టణంలో కోడి గుడ్లు ఎక్కడా దొరకటం లేదా?' ఆమె అడిగింది.

'గుడ్లు దొరుకుతాయి అత్తా. కాని మాకు తాజాగుడ్లు కావాలి. వాటిని మేం తయారుచేసిన ఇంక్యుబేటర్‌లో ఉంచి కోడిపిల్లల్ని పొదుగుతాం.'

మా ప్రణాళిక అత్తకి నచ్చింది. ఆమె తన వంటింటిలోంచి 15 చక్కటి గుడ్లను తెచ్చి ఇచ్చింది. అవన్నీ తాజా గుడ్లని ఎవరైనా ఇట్టే చెప్పగలరు.



మేం తెచ్చిన బుట్టలో అత్తగుడ్లను ఉంచి అవి తిరుగు ప్రయాణంలో చల్లబడి పోకుండా ఉండటానికి ఒక వెచ్చటి శాలువా చుట్టింది.

అత్తకు వీడ్కోలు పలికి మేం తిరుగు ప్రయాణమయ్యాం. కానీ ఇంటికి చేరుకునేసరికి రాత్రి అయిపోయింది. మా ప్రయోగాన్ని మరుసటి రోజు మొదలుపెట్టాలనుకుని నిద్రపోయాం.

## ప్రయోగం మొదలు

మరుసటి రోజు బడి నుంచి తిరిగి రాగానే ముందుగా గుడ్లను ఇంక్యుబేటర్‌లో ఉంచాం. మూతపెట్టె రంధ్రంలో థర్మామీటరు ఉంచాం. బల్బు వెలిగించడానికి ముందు అన్ని మరొకసారి సరిచూడాలనుకున్నాం. ముందుగా ఇంక్యుబేటర్‌ను వేడిచేసి ఆ తరువాత గుడ్లను దాంట్లో ఉంచితే బాగుంటుందేమో? డబ్బాలో మూసి ఉంచడం వల్ల గుడ్లు చెడిపోతాయేమోనన్నది మా భయం. గుడ్లలో ప్రాణం ఉంటుందనీ, పెంకులోంచి అది ఊపిరితీసుకుంటుందనీ మేం పుస్తకంలో చదివాం. మిగిలిన ప్రాణులకు మాదిరిగానే గుడ్లు కూడా ఊపిరి తీసుకునేటప్పుడు బయటికి బొగ్గుపులుసువాయువును వదులుతాయి. ఈ విషయం గుర్తుకురాగానే గుడ్లను జాగ్రత్తగా డబ్బాలోంచి బయటికి తీశాం. ఆ తరువాత బొగ్గుపులుసువాయువు బయటికి వెళ్ళటానికి డబ్బాలో చిల్లులు చేశాం.

ఎటువంటి పొరపాటు జరగకుండా ఉండటానికి పుస్తకంలోని సూచనలు మరొకసారి చదివాం. ఇంక్యుబేటర్ లోపల గాలిలో తగినంత తేమ ఉండాలని దాంట్లో రాసి ఉంది. గాలిలో తేమ లేకపోతే గుడ్ల లోపలి తేమంతా పెంకులోని రంధ్రాలనుంచి బయటికి వచ్చి గుడ్డు ఎండిపోతుంది. ఫలితంగా దాంట్లోని చిన్నారి ప్రాణం చనిపోతుంది. డబ్బాలో తగినంత

తేమ ఉండటానికి రెండు గ్లాసులను నీళ్ళతో నింపి వాటిని డబ్బాలోపల పెట్టాం. అయితే గ్లాసులు డబ్బా కంటె ఎత్తు అయిపోయి మూతపెట్టడం వీలుకాలేదు. చివరికి మిష్కా చెల్లెలు మాయా ఆట వస్తువులలో రెండు చిన్న గిన్నెలు కనిపించాయి. ఆ గిన్నెల్లో నీళ్ళు నింపి డబ్బాలో ఉంచాం. ఆ తరువాత గుడ్లు పెట్టాం. పాత్రలు కొంత చోటు ఆక్రమించుకోవటంతో ఇప్పుడు డబ్బాలో పన్నెండు గుడ్లు మాత్రమే పట్టాయి. మేం తన పాత్రలని తీసుకున్నామని తెలిసిన తరువాత అవి కావాలని మాయా ఏడ్వటం మొదలుపెట్టింది. మేం ఆమెను బుజ్జగించి ఒక కోడిపిల్లను ఇస్తామని నచ్చచెప్పాం.

'నేను ఏం చేసినా అది సరిగా జరగదు' నేను అన్నాను. మిష్కా కూడా దాదాపు అటువంటి అభిప్రాయాన్నే వ్యక్తపరిచాడు. మొదట్లో ధర్మామీటరు 64 డిగ్రీలే సూచించింది. దాంతో మేం బల్బు కిందకి మరొక పుస్తకాన్ని దొప్పించాం. అయితే కొంచెంసేపటికే వేడిమి పెరిగి 104 డిగ్రీలకు చేరుకుంది.

'వేడిమి పెరగకుండా చూడు' మిష్కా అరిచాడు. బల్బు కిందనుంచి ఒక లావుపాటి పుస్తకాన్ని తీసేసి దానికి బదులు ఒక పలచని నోట్‌బుక్ దొప్పించాం. దడదడలాడుతున్న గుండెలతో ధర్మామీటరును గమనిస్తూనే ఉన్నాం.

'ఇరవైఒక్క రోజులపాటు వేడిమి 102 డిగ్రీల దగ్గర ఉండేట్లు ఎలా చెయ్యగలం?' మిష్కా అడిగాడు. 'వేడిమి స్థిరంగా ఉండేలా చెయ్యలేకపోతే మనం చేసినదంతా పాడైపోతుంది.' నేను అన్నాను.

రోజంతా ఇంక్యుబేటర్ దగ్గరే కూర్చుని ధర్మామీటరునే చూస్తూ ఉన్నాం. మా హోంవర్క్ కూడా అక్కడే కూర్చుని పూర్తి చేశాం.



'అంతా బాగానే ఉంది,' మిష్కా అన్నాడు, 'అంతే ఇలాగే ఉంటే 21 రోజుల తరువాత మనకి 12 కోడిపిల్లలు వస్తాయి. భలేగా ఉంటుంది కదూ!'

## వేడిమి పడిపోతోంది

ఇతరుల సంగతి నాకు తెలియదుకానీ ఆదివారం రోజున చాలాసేపటిదాకా పడుకోవడం నా అలవాటు. వారంలో ఒక్క రోజు ఇలా పడుకోవడం చాలా ఇష్టంగా ఉంటుంది. ఇలా వారంలో ఒక్క రోజు ఎక్కువసేపు పడుకోవడం నేరమేమీ కాదు కదా? అదే విధంగా ఆ ఆదివారం మెలకువ వచ్చేసరికి తెల్లారిపోయింది. బద్ధకంగా మళ్ళీ నిద్రపోదామనుకునే సరికి నాకు ఇంక్యుబేటర్ సంగతి గుర్తుకువచ్చి లేచి వెంటనే మిష్కా వాళ్ళింటికి చేరుకున్నాను. రాత్రి అంతా నిద్రపోనట్లుగా మిష్కా కళ్ళు వాచి ఉన్నాయి.

'రాత్రి నిద్రపోయేముందు అంతా బాగానే ఉంది. కాని మధ్యలో లేచి చూస్తే వేడిమి 101కి పడిపోయి ఉంది. నేను వెంటనే బల్బుకిందకు ఒక పుస్తకం దొప్పించి చూస్తే వేడిమి 102కి పెరిగింది. మళ్ళీ కొంతసేపటికి లేచి చూస్తే వేడిమి 101కి పడిపోయింది. ఇంకొక పుస్తకం దొప్పించాల్సి వచ్చింది. ఇప్పటికి అంతా బాగానే ఉంది కానీ మళ్ళీ వేడిమి పడిపోదన్న నమ్మకమేమీ లేదు' మిష్కా అన్నాడు.

ముందుగా మిష్కాని కాసేపు నిద్రపొమ్మని చెప్పాను. తరువాత 'కోళ్ళపెంపకం' అన్న పుస్తకం మరొకసారి చదవటం మొదలుపెట్టాను. గుడ్లను మార్చకుండా ఒకేవైపు ఉంచితే లోపలి పిండం పెంకుకి అతుక్కుపోయి పిల్ల బలహీనంగా పుడుతుందని పుస్తకంలో ఉంది. దాంతో నేను గుడ్లను తిప్పటం మొదలుపెట్టాను. అంతలోకి మిష్కా లేచి ఒక్క ఉదుటున నాదగ్గరకు వచ్చాడు.

‘ఏం చేస్తున్నావు?’ మిష్కా అరిచాడు.

అతడి అరుపువిని మిష్కా వాళ్ళ అమ్మా, నాన్న కూడా వచ్చారు. కోడి గుడ్లను పొదిగేటప్పుడు అది కూడా గుడ్లను తిప్పుతూ ఉంటుందని వాళ్ళు చెప్పారు. అందుకనే మనం కూడా అప్పుడప్పుడు గుడ్లను తిప్పుతూ ఉండాలి.

## వేడిమి పెరిగింది

పది గంటలకు వేడిమి ఒక డిగ్రీ పెరిగింది. వెంటనే బల్బు నుంచి ఒక పుస్తకం తీసేశాం.

‘రాత్రిళ్ళు వేడిమి తగ్గుతోంది. ఇప్పుడేమో పెరుగుతోంది. విషయమేమీ అర్థం కావడంలేదు’ మిష్కా అన్నాడు. ఆ తరువాత సోఫాలో పడుకుని నిద్రపోయాడు. నేను ఆ గదిలో కుర్చీలో కూర్చుని ఒక పుస్తకం చదువసాగాను. కొంచెం సేపటికి మిష్కా స్నేహితుడు కోత్యా వచ్చి అతడిని నిద్రలేపాడు. నిద్రలేస్తూనే మిష్కా ఇంక్యుబేటర్ దగ్గరికి వెళ్ళి నా మీద అరవటం మొదలుపెట్టాడు: ‘నీకేమైనా స్పృహ ఉందా? వేడిమి 103కి చేరుకుంది. నేను లేవకపోతే 104 డిగ్రీలకు చేరుకునేదే. నీ దృష్టి అంతా ఎక్కడ ఉంది?’

కోత్యా ఇంక్యుబేటర్ చూసి మాకు సహాయం చేయటానికి అతడు కూడా ఉండిపోయాడు. ఎనిమిది గంటలకు గుడ్లను తిప్పవలసి ఉంది. మేం గుడ్లను తిప్పుతున్నప్పుడు మాయా వచ్చింది. ఆమె అన్నింటిలోకి పెద్ద గుడ్డును చూసి దాంట్లోంచి వచ్చే పిల్ల తనదని చెప్పింది.

‘గుడ్లమీద గుర్తులు పెడితే ఏ గుడ్డు తిప్పారో, ఏ గుడ్డు తిప్పలేదో మీకు తెలుస్తుంది’ కోత్యా సలహా ఇచ్చాడు.



వెంటనే మిష్కా అన్ని గుడ్లమీద పెన్సిలుతోటి నంబర్లు వేశాడు. ‘బడిలో ఎవరికీ ఇంక్యుబేటర్ గురించి చెప్పకు’ కోత్యా వెళ్ళిపోతుంటే మిష్కా చెప్పాడు. కోత్యా అందుకు ఒప్పుకున్నాడు.








# మాయాకి పడిన డ్యూటీ

ధర్మామీటరును చూస్తూ వేడిమిపై నిఘా ఉంచవలసిన కారణంగా మిష్కాకి రాత్రిళ్ళు నిద్రపోయే అవకాశం దొరకటం లేదు. రాత్రి చలి కారణంగా వేడిమి పడిపోతోందని, పగలు ఎండ కారణంగా వేడిమి పెరుగుతోందని అర్థమయ్యింది. బడికి వెళ్ళినప్పుడు వేడిమిని ఎవరు గమనిస్తూ ఉండాలన్నది ఇప్పుడు మా ముందున్న సమస్య. తాను లేనప్పుడు వేడిమిని చూస్తూ



ఉండేలా మాయాని మిష్కా ఒప్పించాడు. వేడిమిని ఎట్లా తగ్గించాలో కూడా అతడు మాయాకి అనేకసార్లు వివరించాడు. ఆ తరువాత నేను గుడ్లు తిప్పే విధానాన్ని మాయాకు చేసి చూపించాను. మాయాకి అంతా అర్థమయిన తరువాత మేం బడికి వెళ్ళాం.

బడిలో కనబడుతూనే కోత్యా 'ఇంక్యుబేటర్ ఎలా పనిచేస్తోంది' అని ఆగబట్టలేక అడిగేశాడు.

'ఇంక్యుబేటర్ గురించి ఎవ్వరికీ చెప్పనన్నావు' మిష్కా అతడికి గుర్తు చేశాడు.

తరగతిలో మిష్కా ఏమాత్రం ధ్యాస పెట్టలేకపోయాడు. మాయ ఏదైనా పొరపాటు చేస్తే అంతా పాడైపోతుందని అనుకోసాగాడు. మాయ ఇంకా చిన్న పిల్ల. బయటికి ఆడుకోటానికి వెళ్ళిందంటే ఇంకా అన్ని సంగతులు మరిచిపోతుంది.

కోత్యా తన మాట నిలుపుకోలేకపోయాడు. జీవశాస్త్రం తరగతి మొదలయినప్పుడు అతను చెయ్యి ఎత్తి ప్రకృతి క్లబ్ టీచరును ఇలా అడిగాడు: 'మారియా టీచర్! ఇంక్యుబేటర్ అంటే ఏమిటి?'

మారియా ఇంక్యుబేటర్ గురించి చెప్పసాగింది. గుడ్లను ఒక స్థిరమైన ఉష్ణోగ్రత వద్ద కొన్నిరోజులపాటు ఉంచితే గుడ్లు పొదిగి వాటిల్లోంచి పిల్లలు బయటకు వస్తాయి.

'ఇంటిదగ్గర ఇంక్యుబేటర్ తయారుచేసిన ఇద్దరు వ్యక్తులు నాకు తెలుసు,' కోత్యా చెప్పాడు, 'దాంట్లో గుడ్లు పొదిగి పిల్లలు వస్తాయంటారా?'

'ఇంట్లో తయారుచేసిన ఇంక్యుబేటర్‌లోనూ గుడ్లను పొదిగి పిల్లలు చేయవచ్చు. కాని ఇది చాలా కష్టమయిన పని,' మారియా బదులిచ్చింది,

'ఫ్యాక్టరీలో తయారయ్యే ఇన్‌క్యుబేటర్లలో వేడిమి, తేమలను యంత్రాల ద్వారా అదుపులో ఉంచుతారు. నీ మిత్రులు శ్రద్ధపెట్టి కష్టపడితే తమ ప్రయత్నంలో విజయం సాధిస్తారు. కానీ కోల్యా, మిష్కా లాంటివాళ్ళు ఇంక్యుబేటర్ తయారుచేస్తే దాంట్లోంచి ఏమీ రాదని నా అభిప్రాయం.'

తరగతి పూర్తయిన తరువాత ప్రకృతి క్లబ్ లీడర్ విత్యా మా ఇద్దరినీ పట్టుకుని ఈ రోజు క్లబ్‌లో పని మీ వంతు అని చెప్పాడు. పక్షులకు చిన్న చెక్క ఇల్లు ఒకటి చేయాలంట.

'ఈ రోజు మాకు ఏమాత్రం సమయంలేదు' మిష్కా చెప్పాడు. విత్యాకి మా మీద చాలాకోపం వచ్చింది.

మేం పరిగెత్తుకుంటూ ఇంటికి వచ్చాం. మాయ అప్పగించిన పనిని ఎంతో జాగ్రత్తగా చేసింది. ఆమెకు ధన్యవాదాలు చెప్పి ఆడుకోటానికి బయటకి పంపించేశాం.

## తిరిగి సమస్యలు

ఇప్పుడు మా జీవితం చాలా క్రమబద్ధంగా మారిపోయింది: ధర్మా మీటరుపై దృష్టి నిలిపి ఉంచటం, ప్రతి మూడు గంటలకు గుడ్లను తిప్పటం. వేడి కారణంగా ట్యాంకులోనూ, పాత్రల్లోనూ నీళ్ళు ఆవిరి అయిపోతుంటాయి. కాబట్టి వాటిని మధ్యమధ్యలో నింపుతుండాలి. ప్రతిరోజూ రాత్రి నేను అలారం పెట్టుకుని నిద్రపోయి అర్ధరాత్రి లేస్తాను. ఆ తరువాత నాకు మళ్ళీ నిద్రరాదు. తెల్లారేసరికి కళ్ళు వాచిపోయి ఉంటాయి. తొందరగా తయారయ్యి బడికి వెళతాను. నిద్రమత్తులో ఒకొక్కసారి చొక్కాలో కాళ్ళు పెడతాను. బట్టలు తిరగమరగ వేసుకుంటాను. బడిలో తోటిమిత్రులు నన్ను ఆట పట్టించేవాళ్ళు.

పదవతారీకు రాత్రి ఒక ప్రమాదం జరిగింది. నేను రాత్రి నిద్రపోయి మళ్ళీ ఉదయమే లేచాను. వెళ్ళి చూస్తే వేడిమి 99డిగ్రీలు అంటే 3 డిగ్రీలు





తక్కువ వుంది. నేను వెంటనే బల్బుకిందికి రెండు పుస్తకాలు చొప్పించాను. కాని దానివల్ల ప్రయోజనం ఉంటుందో లేదో నాకు తెలియదు. లేకపోతే పది రోజుల శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరే అవుతుంది.

కొంచెం సేపటికి వేడిమి 102 డిగ్రీలకు పెరిగింది. ఆ సమయంలో మిష్కా వచ్చాడు. అతనికి నేను ఏమీ చెప్పలేదు. కానీ ఇప్పుడు ఇక ఏంచేసినా దండగ అనిపించసాగింది.

## తరగతిలో సమావేశం

రోజూ బడిలో విత్యాకి ఇంక్యుబేటర్ గురించి కోత్యా చెప్పేవాడు. అయితే నేను, మిష్కా చేసిన దాని గురించి ఇప్పటివరకు చెప్పలేదు.

'ఇంతటి నైపుణ్యం ఉన్న వాళ్ళు మన ప్రకృతి క్లబ్‌లో ఉంటే ఎంత బాగుంటుంది' విత్యా అన్నాడు.

ఇంక్యుబేటర్ కారణంగా మా చదువు బాగా దెబ్బ తింది. ఆ కారణంగా నాకు ఆల్జీబ్రాలో అయిదింటికి రెండు మార్కులేవచ్చాయి. తరగతి టీచర్ ఒకరోజు మా ఇద్దరినీ బాగా కోప్పడింది. 'ఇటీవల కాలంలో మిష్కా, కోత్యాలు హోంవర్క్ చెయ్యటంలేదని నాకు తెలుసు. తరగతిలో చదువులపై ఏమాత్రం శ్రద్ధ పెట్టటంలేదు. ఒకళ్ళతో ఒకళ్ళు గుసగుసలాడుకుంటున్నారు. అప్పుడప్పుడు తరగతిలో నిద్రపోతున్నారు కూడా!' అంటూ టీచరు కోప్పడ్డారు.

మా ఇద్దరిని ఇలా కోప్పడుతున్నప్పుడు కోత్యా లేచి ఇలా చెప్పడం మొదలుపెట్టాడు: 'ఇది వీళ్ళిద్దరి తప్పుకాదు. నేను చెబుతున్న ఇద్దరు మిత్రులు వీళ్ళే. ఎంతో కష్టపడి వీళ్ళు ఇంక్యుబేటర్ తయారుచేశారు.'

మిష్కా, నేను ఇంక్యుబేటర్ తయారుచేయటం, దానిమీద ప్రయోగాలు చేయటం గురించి విని తరగతిలో పిల్లలందరూ ఆశ్చర్యపోయారు. మేం ఇటువంటిది చెయ్యగలమని ఎవరికీ నమ్మకం కుదరటం లేదు.

'వీళ్ళిద్దరూ కష్టపడి ఇంక్యుబేటర్ తయారు చేశారు.కానీ దీని గురించి ఎవ్వరికీ చెప్పలేదు. మనం వీళ్ళకి సహాయం చేయాలి' విత్యా అన్నాడు.

తరగతిలో పిల్లలందరూ ఇందుకు ఒప్పుకున్నారు. రాత్రి అన్నం తిన్న తరువాత మిష్కా వాళ్ళింటికి వచ్చి ఇన్క్యుబేటర్ చూస్తుంటానని విత్యా మాట ఇచ్చాడు.

## బడి పిల్లల సహాయం

రాత్రి అన్నం తిన్న తరువాత బడిలోని ప్రకృతి క్లబ్ సభ్యులందరూ మా వంటింట్లో జమ అయ్యారు. మేం వాళ్ళకు ఇంక్యుబేటర్ చూపించాం. దాంట్లో గుడ్లను వెచ్చగా ఉంచే విధానం, మధ్య మధ్యలో గుడ్లను తిప్పుతుండటం వంటి వాటన్నింటి గురించి వివరించాం. ఆ తరువాత





ఎవరు, ఏ సమయంలో సహాయపడతారో పట్టిక తయారుచేశాం. ఆ సమయంలో వాళ్ళు ఏం చెయ్యాలో పూర్తిగా వివరించాం. ప్రతిరోజూ బడి అయిన తరువాత ఇద్దరు పిల్లలు సహాయం చెయ్యడానికి వస్తారు. వాళ్ళు ఏం చేయాలో నేను, మిష్కా వివరిస్తాం. వీళ్ళిద్దరూ కూడా వంతులవారీగా ఇంటికివెళ్ళి భోజనం, హోంవర్కు పూర్తిచేసుకుని వస్తారు. రాత్రిళ్ళకు కూడా బాధ్యత వహించటానికి బృందాలు తయారయ్యాయి.

ఈ రోజు విత్యా, జిన్యాల డ్యూటీ. నన్ను, మిష్కాని మా పని చూసుకోమని వాళ్ళు చెప్పారు. మా ఇద్దరికీ చాలా రోజులకు పాఠాలు పూర్తి చేసే సమయం దొరికింది. లెక్కల్లో ఒక సమస్య తొందరగానే చెయ్యగలిగాం. కానీ ఇంకొకటి ఎంత కొట్టుకులాడినా రాలేదు. దీనిగురించి అడగటానికి జిన్యా దగ్గరికి వెళ్ళాం. ఆ తరువాత మిష్కాది, నాది డ్యూటీ ఎప్పుడు వస్తుందో లెక్కగట్టాం. అది ఇరవైఒక్కటవ రోజు, అంటే గుడ్లు పొదిగి పిల్లలయ్యే రోజు కాబట్టి మాకెంతో సంతోషం వేసింది.

# చివరి ఏర్పాట్లు

మిష్కాకి, నాకు చివరికి కొంత విశ్రాంతి దొరికింది. నిజం చెప్పాలంటే ధర్మామీటరును చూసి, చూసి మాకు విసుగు కూడా వచ్చేసింది. ప్రకృతి క్లబ్‌లో చెక్కలతో పక్షులకు రెండు గూళ్ళు చేయటానికి, బడిలో పళ్ళు, పూలచెట్లు నాటడానికి మాకు సమయం దొరికింది. తరువాత పరీక్షల్లో మాకు మంచి మార్కులు రావడంతో మా అమ్మ, నాన్నలు కూడా సంతోష పడ్డారు. మేం నాటిన విత్తుల్లోంచి చిన్న చిన్న మొలకలు రాసాగాయి. అయితే గుడ్లనుంచి రావలసిన పిల్లల జాడ ఇప్పటికీ మాకు తెలియలేదు.

మా వంతు శుక్రవారం నాడు వచ్చింది. దాని కంటే ఒక రోజు ముందునుంచే మా ఆత్రుతను ఆపలేకపోయాం. కాని మిగిలిన వాళ్ళు మమ్మల్ని ఇంక్యుబేటర్ దగ్గరికి వెళ్ళనివ్వలేదు. వాళ్ళని ఎన్నోరకాలుగా బతిమాలాం. గుడ్లనుంచి పిల్లలు వస్తున్నట్లయితే మాకు తెలియచేస్తామని చివరికి వాళ్ళు ఒప్పుకున్నారు.

మిష్కా నా వంతు రానేవచ్చింది. గుడ్లలోపలనుంచి ఏదో సన్నటి ధ్వని వస్తున్నట్లు మిష్కాకి అనిపించసాగింది. ఒక గుడ్డు తీసుకుని మిష్కా చెవి దగ్గర పెట్టుకుని దాంట్లోంచి వచ్చే శబ్దాన్ని వినసాగాడు. ఇంతలోనే బయట కాలింగ్ బెల్ మోగటంతో మిష్కా చేతిలోంచి గుడ్డు కింద పడినంత పనయ్యింది. పిల్లలు పొదగటం మొదలయ్యాయో లేదో తెలుసుకుందామని విత్యా వచ్చాడు. మేం చాలాసేపు అక్కడే కూర్చున్నాం. చివరకు బడికి వెళ్ళే సమయం అయ్యింది. మేం లేని సమయంలో పిల్లలు బయటకు రావడం మొదలయితే ఆ భారమంతా చిన్ని మాయ మీద పడుతుందన్న భయం వేసింది.





బడిలో సమయం ఎలా గడిచిందో మాకే తెలియదు. తరగతిలో పాఠాలపై ఎవరికీ దృష్టి నిలవడంలేదు. ఇంటి బెల్లు ఎప్పుడు కొడతారా అని అందరూ ఎదురు చూడసాగారు. గంట మోగటంతోనే పరిగెత్తుకుంటూ ఇంటికి చేరుకున్నాం. వస్తూనే మిష్కా ఇంక్యుబేటర్ మూత తీశాడు. తెల్లరాళ్ళ మాదిరి గుడ్లు డబ్బాలో పడి ఉన్నాయి. ఒక్క దాంట్లోనూ పగులన్నదిలేదు.

## పొరపాటు ఎక్కడ జరిగింది?

పిల్లల్లో ఒక్కరు కూడా మాట్లాడలేదు. గుడ్లలోంచి పిల్లలు రావేమోనని అనిపించసాగింది. ఇప్పుడు ఎలా అని మిగిలిన పిల్లలు మిష్కాని అడగసాగారు.

'నాకేం తెలుసు? నేనేమి కోడిని కాదుకదా' మిష్కా బదులు పలికాడు. ఎవరికి తోచింది వాళ్ళు మాట్లాడసాగారు. కొంత మంది పిల్లలు వస్తాయంటే, కొంతమంది రావన్నారు.

అప్పటికి 21వ రోజు ఇంకా పూర్తికాలేదు. కాబట్టి గుడ్లలోంచి పిల్లలు వచ్చే అవకాశం ఉంది. రోజులు లెక్కపెట్టడంలో ఎక్కడా పొరపాటు జరగలేదు కదా? ఆరోజు రాత్రి జరిగిన ఘటన నా మనసును తొలుస్తోంది. అలారం కొట్టినా ఆ రాత్రి నిద్ర లేవలేదు. తెల్లవారి లేచిచూసేసరికి వేడిమి 99 డిగ్రీలకు పడిపోయి ఉంది. నా అంతరాత్మ నన్ను పొడుస్తూ ఉంది. ఆ చిన్ని పిల్లలను చంపింది నేనేనని అనిపించసాగింది. అమ్మను అడిగి ఆ రాత్రి మిష్కా వాళ్ళ ఇంటిదగ్గర ఉండిపోయాను.

పొద్దున్నే లేచేసరికి ఎలా ఉన్నది అలాగే ఉంది. ఇంక్యుబేటర్‌లో గుడ్లు అలాగే పడిఉన్నాయి. ఒక్క గుడ్డుకీ పగులు లేదు, ఒక్క దాంట్లోంచి కూడా శబ్దం రావటం లేదు.

## ఆశలు అన్నీ అంతరించిపోయిన వేళ

ఆ రోజు అంతా ఉదాసీనంగా ఎలాగో గడిచింది. వంటింట్లో పరిస్థితి అలాగే ఉంది. ఇంక్యుబేటర్ వేడిగా ఉంది, బల్బు వెలుగుతూ ఉంది, కానీ మా ఆశలు అడుగంటాయి. ఉన్నట్లుండి మిష్కా పెద్దగా అరిచాడు. అతడి చేతిలో ఉన్న గుడ్డుకి చిన్న పగులు కనబడింది.





'బయటికి తీసేటప్పుడు గుడ్డు దేనికైనా తగిలి ఏర్పడిన పగులు కాదు కదా?' నేను అడిగాను. పగిలిన గుడ్డు పెంకును కొంచెం తీయగానే పసుపు రంగులో బుల్లి ముక్కు ఒకటి బయటికి వచ్చి మళ్ళీ లోపలికి వెళ్ళిపోయింది. ఆనందంతో మేం పిచ్చివాళ్ళమైపోయాం. నోటి వెంట ఒక్క మాట కూడా రాలేదు. ఇద్దరం అలా చూస్తూ ఉండిపోయాం.

ఈ సంతోష వార్త మిగిలిన పిల్లలతో చెప్పటానికి మిష్కా పరిగెత్తుకుంటూ వెళ్ళాడు.

'గుడ్డు ఎక్కడికి తీసుకువెళుతున్నావు?' అంటూ నేను అరిచాను. అతడు చప్పున గుడ్డును ఇంక్యుబేటర్‌లో తిరిగి పెట్టాడు.

అంతలోనే కోత్యా వచ్చాడు. అతడి ఆనందానికీ హద్దులు లేవు. మిగిలిన వాళ్ళని పిలుచుకుని రావటానికి అతడు పరిగెత్తాడు. మా అమ్మకి

ఈ విషయం చెప్పటానికి నేను పరిగెత్తాను.

కొంచెం సేపటికి మిష్కా వాళ్ళ అమ్మ, నాన్న వచ్చారు. నా చేతిలో గుడ్డు ఉండటం చూసి 'గుడ్డుని వెంటనే ఇంక్యుబేటర్‌లో పెట్టెయ్యి, లేకపోతే కోడిపిల్లకు జబ్బు చేస్తుంది' అంటూ మిష్కా అరిచాడు.

'మిగిలిన గుడ్లలో దేనికైనా పగులు ఏర్పడిందా?' అని విత్యా అడిగాడు.

అన్నింటినీ పరీక్షించిన తరువాత 'అయిదవ నెంబరు ఉన్న గుడ్డుకి మాత్రమే పగులు ఉంది' మిష్కా అన్నాడు.

'గుడ్డు లోపల పిల్లలకు ఎంత కష్టంగా ఉందో. మనమే పెంకును పగులగొట్టి పిల్లలను బయటకు తీద్దాం' జిన్యా అన్నాడు.

'వద్దు, వద్దు! కోడిపిల్ల రెక్కలు చాలా నాజూకుగా ఉంటాయి. పెంకును మనమే పగలగొడితే అవి దెబ్బతింటాయి' మిష్కా అన్నాడు. అంతలోనే 11 నెంబరు ఉన్న గుడ్డులో పగులు కనిపించింది. పిల్లలందరూ ఇంక్యుబేటర్‌కి అతుక్కుపోయి కూర్చున్నారు. రాత్రి సుమారు రెండు గంటల సమయంలో 8, 10 నెంబరు గుడ్లలో పగులు కనబడింది. ఆ సమయంలో ఒక కోడిపిల్ల గుడ్డునుంచి బయటకి వచ్చింది. అది నిలబడడానికి ప్రయత్నిస్తోంది కాని, ప్రతిసారీ అది పడిపోతోంది.

నేను కోడిపిల్లను చేతిలోకి తీసుకున్నాను. అది ఇంకా తడిగానే ఉంది. దూదిలాంటి మెత్తని బొచ్చుతో భలే ముద్దుగా ఉంది. మిష్కా ఒక డబ్బా తీసుకొచ్చాడు. నేను కోడిపిల్లను దాంట్లో వేశాను. కోడిపిల్ల, తడి తొందరగా ఆరటానికి ఆ డబ్బాను వేడినీళ్ళల్లో ఉంచాం. అంతపెద్ద కోడిపిల్ల ఇంత చిన్న గుడ్డులో ఇమిడి ఉండటం ఎంత ఆశ్చర్యకరమైన విషయం.





# మా పొరపాటు

మా పనిలో ఎంత మునిగిపోయామంటే తెల్లవారింది కూడా మాకు తెలియలేదు. సూర్యుని కిరణాలు ఇప్పుడు వంటింటి గచ్చుమీద పడుతున్నాయి.

కొంతసేపటికి మిగిలిన పిల్లలు కూడా వచ్చారు. అందరికంటే ముందు వచ్చిన వాళ్ళలో జిన్యా, కోత్యా ఉన్నారు.

'రండి! ముద్దొచ్చే కోడిపిల్లల్ని చూడండి! ప్రకృతి మర్మాలను తెలుసుకోండి' మిష్కా అన్నాడు. పిల్లలందరూ కోడిపిల్లలను గంభీరంగా చూస్తుండిపోయారు. రాత్రంతా మేల్కొని ఉన్నందువల్ల మిష్కా కళ్ళు ఎర్రబడ్డాయి. మిష్కాని వెళ్ళి కాసేపు పడుకోమని జెన్యా చెప్పాడు. చూస్తుండగానే మరికొన్ని కోడిపిల్లలు గుడ్లనుంచి బయటికి వచ్చాయి. నేను 4, 8, 10 నెంబరు ఉన్న గుడ్ల పెంకుల్ని ఇన్‌క్యుబేటర్ నుంచి బయటికి తీసేశాను. కాని ఏ కోడిపిల్ల ఏ గుడ్డునుంచి వచ్చిందో ఇప్పుడు చెప్పటం కష్టం. అయితే 5వ నెంబరు గుడ్డునుంచి పిల్ల ఇంకా బయటికి రాలేదు. బహుశా అది చాలా బలహీనంగా ఉందేమో. అది చేసిన చిల్లుని మేం కొంచెం పెద్దదిగా చేశాం. దాని లోపల కోడిపిల్ల కూడా కనిపించింది. అది తల కదిలిస్తూ ఉండటంతో అది బతికే ఉందని తెలుస్తోంది. ఆ గుడ్డును తిరిగి ఇన్‌క్యుబేటర్‌లో పెట్టేశాం.

కాని గుడ్లు పొదగటానికి ఒక రోజు ఎక్కువ ఎందుకు వేచి ఉండాల్సి వచ్చింది? మా లెక్కలో ఎక్కడైనా పొరపాటు జరగలేదు కదా? రెండవసారి రోజుల్ని సరిగా లెక్కించడంతో మేం చేసిన పొరపాటు అర్థమయింది. మధ్యలో ఒక రోజు తేడా వచ్చింది. మేం సరిగా లెక్కించి ఉంటే ఇంత ఆందోళన పడవలసి వచ్చేది కాదు.



# పుట్టిన రోజు

ఆరోజు సాయంత్రానికి వేడి గంపలో పది కోడిపిల్లలు అటు ఇటు పరుగెత్తుతున్నాయి. అయిదవ నెంబరు గుడ్డునుంచి పిల్ల అన్నిటిలోకి ఆఖరున బయటకు వచ్చింది. అది తేలికగా బయటకు రావటానికి మేం పెంకును కొంత తియ్యాల్సి వచ్చింది. మిగిలిన కోడిపిల్లలతో పోలిస్తే అది బలహీనంగానూ, చిన్నగానూ అనిపిస్తోంది. సాయంత్రానికి ఇంక్యుబేటర్‌లో రెండు గుడ్లు మాత్రం మిగిలి ఉన్నాయి. ఆ రాత్రి అంతా బల్బు వెలిగించి ఉంచినా ఏం ప్రయోజనం లేకపోయింది.

పది కోడి పిల్లలు వెచ్చటి గంపలో అటు ఇటూ తిరుగుతూ ముద్దులొలుకుతున్నాయి. కొన్ని వేగంగా పరిగెడుతూ ఉంటే, కొన్ని తడబడుతూ నడుస్తున్నాయి. ఏదో ఏరుకుని తింటున్నట్లు తమ ముక్కులతో అవి నేలను పొడుస్తున్నాయి.

'వాటికి ఆకలి వేసినట్లుంది' మిష్కా అన్నాడు. మేం వెంటనే ఒక గుడ్డు ఉడకబెట్టి, దాన్ని చిన్న చిన్న తుంపులుగా చేసి గంపలో వేశాం. కాని కోడిపిల్లలు వాటిని ముట్టుకోను కూడా ముట్టుకోలేదు. అప్పుడు మిష్కా తన వేలితో నేలమీద తట్టాడు కోడిపిల్లలు అతడిని అనుకరిస్తూ ముక్కులతో పొడిచి తినడం మొదలుపెట్టాయి. మేం ఒక గిన్నెలో నీళ్లు కూడా ఉంచాం. అవి వెంటనే నీళ్ళు తాగాయి.

ఆ రోజు బడిలో పిల్లలందరూ జీవశాస్త్రం టీచరు మారియాకి ఆ కోడిపిల్లల గురించి చెప్పారు. కోడిపిల్లల పుట్టినరోజు జరుపుకోవాలని దానికి అందరూ ఏదో ఒకటి తీసుకురావాలని నిర్ణయించారు.

పుట్టినరోజు జరుపుకోవడానికి నేను, మిష్కా ఏర్పాట్లు చేశాం. కొంతమంది పిల్లలు పూలతో వచ్చారు. వారి సద్భావనను పూలు చక్కగా





చాటాయి. మారియా టీచర్ సీసాలో మజ్జిగ తెచ్చింది. ఆ మజ్జిగను పాత్రలో పొయ్యగానే కోడిపిల్లలు ఎంతో ఇష్టంగా తాగాయి. ల్యోశ్కా కోడిపిల్లల కోసం మరమరాలు తెచ్చాడు. కోత్స్యా ఒక డబ్బాలో బియ్యం నూకలు తెచ్చాడు. బియ్యం నూకల్ని కూడా కోడిపిల్లలు ఇష్టంగా తిన్నాయి. కోడిపిల్లలకు తాజా గాలి అవసరమని పిల్లలకి మారియా టీచర్ చెప్పింది. ఇంక్యుబేటర్‌లో పడి ఉన్న రెండు గుడ్లను మారియా టీచర్‌కి చూపించి వాటి గురించి అడిగాం.

‘ఇక వీటినుంచి కోడిపిల్లలు వస్తాయని నేననుకోను’ ఆమె అన్నారు.

కొన్నిరోజులపాటు కోడిపిల్లలను చూడటానికి ప్రతిసాయంత్రం పిల్లలు వచ్చేవారు. కాని కోడిపిలల్ని పట్టణంలో ఉంచటం కష్టమయిన విషయం. అందుకనే పదిహేనురోజుల తరువాత కోడిపిల్లలను ఒక బుట్టలో పెట్టి మిష్కా, నేను వాటిని నతాషా అత్తకి ఇవ్వటానికి బయలుదేరాం. నతాషా అత్త నుంచే కదా మేం గుడ్లని తెచ్చింది. ఇప్పుడు ఆమె సొమ్మును ఆమెకే అప్పగించటానికి వచ్చాం. ఊరిలో స్వచ్ఛమైన గాలి, ఖాళీ ప్రదేశానికి కోడిపిల్లలు కూడా సంతోషంగా ఉన్నట్లు కనిపించాయి.

* * *